రుక్మా—తరుణీ జనవతంసమా! నీకిట్టి నిర్దయయుండునే? నీవనుగ్రహింపకున్నఁ బ్రాణములు పాయుదునని చెప్పుమాట యతిశయోక్తి గాదు. ఔపచారికముగాదు. నాయాన నిక్కము. ఏల నన్ను నిరాదరణ మొనర్చి పోవనెంచెదవు.

## అనుబంధము 11.

నిన్ను నమ్మిన యొకప్రాణిని ప్రాణాపాయమువలనఁ దప్పించుటకు నింత యుపేక్షయా? నీ చరణములంటి వేఁడెదను. నినుమానను.

మోహి—ఆహా! రాజన్యా! ఇదియేమి నీయపేక్ష. దేవవనితనైన నేను నీతో నెట్లు మెలఁగనేర్తు. అంతఃపురమున నెందఱో నీకుఁ దరుణులున్నవారే వారి కనుచర భావమున నేనెట్లుండనేర్తు. ఇది కానిపని. నీకుఁ దెలియదా? ఊరక దేవదర్శన మొనర్చి నీదారిఁబొమ్ము.

రుక్మా—రమణీమణీ! నీవె నన్నింత కటాక్షించితివా! నాయువతులఁ బుత్రుని నా సర్వస్వమును నీయాధీన మొనర్చువాఁడ. నీమాట జవదాటక మెలఁగువాఁడ.

మోహి—రాజేంద్రా! మోహమునఁ గన్ను గానక కార్యసాధనమునకై యేమేమో వచియింపవచ్చుఁగాని యవియన్నియు జరుపుటకగునా? నీవపేక్షించినది క్షణిక సౌఖ్యము. అది లభించినవెంట నే యభిలాషలన్నియుఁ గడముట్టిఁబోవు. తరువాత నొకవిధమగు మోహముండఁగలదా? ఏల తెలియనివిధంగి మాటలాడెదవు. అన్న మాటంతయు నీకు జరుపుటకు సాధ్యమగునా?

రుక్మా—కామినీ! నాసదుద్దేశము సంశయించిన మాటలాడి నీవు నాకెంతయుఁ దప్పొనర్చితివి. అదే! అంగన్న యిష్టకామేశు పాదపద్మములాన వచించెద. నీమాట నేజవదాటువాఁడఁగాను. ఏల నన్నింత పరీక్షించెదవు? నను నీకృపకుఁ బాత్రుని గాఁ జేయుమా?

మోహి—ధరణీవరా! నీకెందఱో తరుణులుందురే? పుత్రుఁడును నున్నవాఁడని నీవాడిన మాటవలనఁ దెలిసె నీదారలతోఁగల యుపభోగము చాలదా? చూచిన వారి నెల్లను రూపులైన మాత్రమున నే యేమి? ఇటు కలయఁగోరుట ధర్మమా? ఈ యాచరణము నీభార్యలు సమ్మతింతురే? నీకుసుఖమా? నాకుసుఖమా? వదలుము నీకోరిక.

రుక్మా—మోహినీ! నాభార్యలెల్ల నేఁగోరినవెంట నే నీకుఁ జరణదాసులుగా నుండుటకు నామోదింపఁ గలరు. నాపుత్రుఁడు నీపుత్రుఁడేయగుఁగదా? ఇంకేల నీవిషమ పరీక్ష? ఎట్లును నను కృతార్థుఁజేయక నీవుఁ దప్పదు. ఆపరమేశునాన వచించెదను. నిన్నుమానిన వనితాంతరప్రసక్తి నే నిచ్ఛయింపను.

మోహి—పరమేశా! ఇష్టకామేశా! నినుదర్శించి పూజయొనరింప వచ్చియున్న నాకు నెట్టి తగులము ఘటించితివి?

రుక్మాం—వనితామణీ! ఇంకఁ దామసింపకుము. నన్ననుగ్రహింపుము. పూర్ణాభిలాష వశమున వాంఛించిన నీకౌఁగిలి దయచేయుము.

మోహి—అయిన నీవు నన్ను విడువవు?

రుక్మాం—నిన్ను విడుచుటకా యింతసేపునుండి నేనిట్లు ప్రార్థించుట?

మోహి—రాజచంద్రా! అప్సరసలగు మాకు మానవసహవాసము నూతనము కాదు. అయిన నన్ను నీవు గారవించినన్ని నాళ్లును వనితాంతర ప్రసక్తి నీవు మానెదవనియు నాయాజ్ఞ నీవుండఁగలవాఁడవనియు నీవు నమ్మకమగు ప్రమాణ మొసంగితివా నేను నీమాటకు సమ్మతింతును.

రుక్మాం—(మోహిని చేతులుబట్టుకొని) రమణీ! నన్ను కృతార్థుఁజేసితివి. నను ధన్యుఁజేసితివి. నీ వేరీతిఁ బ్రమాణముచేయుమన్నను జేయుదును. నాపుత్త్రునాన వచించెదను అదే! ఆలయముననున్న యిష్టకామేశునాన బాసఁజేయువాఁడ. నీవు నన్ననుగ్రహించినన్నినాళ్లు పెఱవనితలఁ గాంక్షింప నీవేమిమాటచెప్పినను నించుకంతైన జవదాఁటక జరుపువాఁడ. ఇంకనైనను నన్ను నమ్మితివా? నీయాలింగనము నేయార్జించితనని యెంచవచ్చునా? (ఆలింగనము చేసికొనఁబోవ).

మోహి—(తప్పించుకొని దూరముపోయి) నిలు మింత త్వరయేల? నీవు ప్రమాణవాక్యము నాయిష్టకామేశునొద్దనే వచియింపుము. పిదప నూరికిఁబోయి నీవచనముల కన్నిటికి నామోదించితినని నీపట్టపుమహిషి యెవ్వరో యామెతోడను నీపుత్త్రవతియగు నీకాంతతోడను బలికింపుము. పిదప నీయిష్టానువర్తనమున నేనుండుదాన.

రుక్మాం—రమణీ! సమధిక వ్యామోహామునఁ దల్లడిల్లుచున్న నీ వేమి పరీక్ష చేసినను నెట్టి ప్రమాణము గోరినను సమ్మతించువాఁడనే. అయిన మఱల నూరికిఁబోయి పుత్త్రవతియగు నాయగ్రమహిషి తోడను సమ్మతించినమాట పలికింపుమనుటకు నీయాలింగనమునకు నంతరాయము కల్పించితివే యిదెట్లు సహింతును.

అనుబంధము 12.

మోహి—నీవు నన్ను జూచి చూడకముందే యింత మోహపుమాటలాడితివి. నీ మోహము క్షణభంగురమగు నేమో యనుభీతిచే నీకింత వకాశమిచ్చితి. అదిగాక తత్కాలమున నుద్భవించిన యంధ మోహమున నీవు నను జేపట్టుట నీమహిషి కయిష్టమైన నప్పుడు మానవుడవు నీకెట్టి దుస్థితియు నెట్టి దుఃఖమును గలుగఁగలదో నీవెఱుఁగ నేరవా? అది నీకు లేకుండఁజేయుటకును నీసమయము నభిలషించితి.

రుక్మాం—కానిమ్ము. నీయిచ్చవచ్చినచొప్పున నెఱవేర్చెద. ఎట్లును నీయిష్టానువర్తనమున మెలఁగనెంచియున్న నన్ను నీవెట్లేలుకొన్నను విహితమేకదా? పోదమురమ్ము స్వామి దర్శనమునకు. (లోనికిఁబోయి) మోహినీ! ఈపరమేశు నెదుటఁ బ్రమాణము చేయుమన్న నీయపేక్ష నిర్వహించెదను.

**మోహి.**—నాథా! నాకేమియుఁ బ్రమాణమువలదు. నీమాటకంటె నిదియొక యెక్కువయా? ఊరక నీమనసరయఁ గోరి యడిగితిఁ గాక. నీవు మాటయిచ్చి యుండిన నే చాలు.

**రుక్మా.**—మనోహారిణీ! నీవెట్టి యుదార దయాగుణభూషణవు. నిన్నుఁ జేపట్టుట నాకెంత ధన్యత. నీవు వలదన్న మానితిఁ గాక నే నాడిన మాటకంటె నీయెడ నొనర్చు ప్రమాణము నాకెక్కువ యనుపించదు. చెప్పినది చెప్పియేయున్నాను. మనకింత సమ్మదమావహింపఁ జేసిన యీయుమామనోహరు నిష్టకామేశు నుతింతము.

సీ. దంభోళిధరసతీ తాంబూలపేటీషు
దహనబింబాధరీస్తనభరేషు
శమనశుద్ధాంతయోషాఫాలభాగేషు
నిఋతిసాధ్వీముఖనీరజేషు
కంధినాయకబాలికాకర్ణపత్రేషు
గంధవహాంగనాకచభరేషు
రాజరాజాంతఃపురస్త్రీకరాగ్రేషు
కరకంఠభామినీకటితటేషు

గీ. చంద్రశకలంతి హారంతి చందనంతి
విశదహాసంతి హీరంతి విచికిలంతి
దర్పణంతి దుకూలంతి తవయశాంసి
క్లేశభవభంగ యిష్టకామేశలింగ.

సీ. కోటిమన్మథరూప హాటకాచలచాప
చటులబాహాటోప శరణుశరణు
శ్రుతిచతుష్టయఘోట శుభ్రగంగాజూట
జలజాసనకరోట శరణుశరణు
వ్యాఘ్రాసురధ్వంస వర్ణితమీమాంస
చంద్రఖండవతంస శరణుశరణు
భుజగేంద్రకేయూర భువనత్రయాధార
సద్భక్తమందార శరణుశరణు

గీ. సతతకరుణాఘనాపాంగ శరణు శరణు
సామజాసురమదభంగ శరణు శరణు
శైలకన్యామనస్సంగ శరణు శరణు
శరణువిశ్వేశశివలింగ శరణు శరణు.

మోహిని—(ముందఱికివచ్చి స్వగతము) ఆహా! ఈరాజవరుపై నాకెంత మోహము జనించినది. ఈయనకుఁగల దైవభక్తియు స్తోత్రనైపుణ్యమును జూడఁ నవకాశము కలిగినంతనే నాయెడ మోహ మెక్కడ తిరుగునో యను భీతి నాకు జనించుచున్నది. అట్లతఁడు ప్రీతి మఱలించిన నే నెట్లోర్వఁగలదానను. ఏమి చేయుదును. (ప్రకాశము) రాజేంద్రా! ఏమేమో దీర్ఘాలోచన చేయుచున్నట్లున్నావు.

రుక్మాం—ఏమియులేదు. నావీనులకు చల్లఁగ నాథా! యని సంభోదించితివి కాని నీకౌఁగిలి యైన నొక ముద్దయిన నాకీక మసలఁ జేసితివేయని చింతించుచుఁ దీఱని యభిలాష వశమున నిన్నడుగుదునా వలదాయని యోచించుకొను చుంటిని.

మోహి—కౌఁగిలికి ముద్దునకు మాత్రము నాథా! నన్నింత యాచింపవలయునా! నీ వపేక్షించిన కార్యమెల్ల నేనును నొనర్పవలసిన దాననేగదా?

రుక్మాం—అట్లయిన నే ధన్యుఁడ. కడుధన్యుఁడ. (అని యాలింగనముచేసి ముద్దిడును.)

(యవనిక పడును.)

——.o ——

"సీ. అనఘులౌరుక్మాంగదావనీశ్వరులకుఁ
దనుముఖ్యదాసిసంధ్యావళిసతి
చరణంబులకుఁ బ్రమ్రొక్కి సలుపువిజ్ఞప్తులు
ప్రాణేశమీరువింధ్యాద్రిసీమ
మోహినీకాంతను మోహించుటయు నామె
వనితాంతరాసక్తి వదలుమనియు
దీనికినాసమ్మతినిబొందుమనియుఁ బ్ర
మాణంబుగైకొన్నమాటవింటి

గీ. సంతసంబునిండెఁ జాలగౌరవమయ్యె
మీకుమదిసఁ బ్రీతిమీఱనిదిగొ
లిఖితమూలమన్నలీలనాసమ్మతిఁ
బంపియున్నదానఁ బ్రాణనాథ.

నాథా! ఇష్టకామేశు సన్నిధి నప్సరస్త్రుణియగు మోహినీ కాంతకును నీకును గలిగిన సమయ నియమములెల్ల వింటిని. ఆ కాంత నిన్నుఁ జేపట్టుటకు నాసమ్మతియొక్క నియమముగాఁ గోరియున్నదని వింటి. ఈ యాచరణము నా కెంతయు గౌరవము గలిగించు నందులకు సంతసించుచు నీవడుగుటకు ముందే నాసమ్మతి యొసఁగా నా మోహినీ కాంతఁ దప్ప నీ యితరకాంతలయొక్క సంసర్గ మొనరించకుండుటకు నే నొప్పుకొంచునను సమ్మతి నోటచెప్పుటకంటె వ్రాఁత మూలమున వచించుటయే యొప్పునని యీకమ్మ వ్రాసియున్నదాన.

నిరతము నిన్ను దైవముగా భజించు,
సంధ్యావళి."

చంద్రకాంతా! ఈకమ్మ యీక్షణమున నెవ్వరితోడనైన మన నాథు నొద్దకుఁ బంపుము.

చంద్ర—అక్కా! కొంచెము యోచించుకొనుము.

సంధ్యా—అటులైన నేనెవ్వరితోడనైనఁ బంపెదను.

చంద్ర—కోపగింపకుము. ఇట్లిమ్ము (జాబుతీసుకొని లోనికిఁబోవును).

కోసల—అక్కా! నీవూహించినది యుక్తమనియే దీర్ఘాలోచన మొనర్చిన నాకుఁ దోఁచుచున్నది. ఇంకే కారణము కాకుండినను నీవు వచించిన తుద కారణము కలుగు కదా యదియేమన్న మోహిని తిరువాతి నీసమ్మతి నలవని చెప్పఁగల కారణము. అది మిక్కిలి సమర్థమైనదని నాకుఁ దోఁచుచున్నది.

సంధ్యా—అంతకంటె ముఖ్యకారణము నాథునాజ్ఞ జరుపుటయే. చెలియా! పాతివ్రత్య ధర్మాచరణమున నెంత మేలు కలదు. సావిత్రిదేవి తన పాతివ్రత్య ప్రభావమున మృతపతిని బ్రతికించుకొనియె. ఇంక నంతకంటె నెక్కుడగు కార్యముకలదా?

[పునః ప్రవేశము: చంద్రకాంత.]

సంధ్యా—పంపితివా సఖియా! యాజాబును?

చంద్ర—అప్పుడే పంపితిని. నాథుఁడింటికి వచ్చునేమో యని నిరీక్షించుచు నింతవఱకు మసలితి.

సంధ్యా—నాథుఁడింటికేల వచ్చునను కొంటివి?

చంద్ర—వింధ్య ప్రాంతమునుండి మఱలివచ్చినపిదప నిద్రఁ జెందుటయును, నీసన్నిధి నడయుటయును మొగములేక యింటివంకను దిక్కులోఁ జూచ సంకోచించు నాథునికి నీవాజాబు పంపుట తొలఁగియౌఁగా వానికిఁ బ్రాపుపనిచ్చినట్లయ్యెఁగదా కాబట్టి పరుగెత్తివచ్చునను కొనుచుంటిని.

[ప్ర: మోహిని (తెలుపటికి ప్రక్కన జాబు చేపట్టి).]

మోహిని—(స్వగతము) ఆహా! ఇదియేమి ఋణానుబంధము. నాకృత్రిమ మోహమంతయు యథార్థ మోహమ్మై పరిణమించె. రత్నాంగను పట్టినపిమ్మట సమ్మతిగోరయుంటిఁ గదా? అది యనుగుమనుటకే నాకు నోరెగయకుండెఁ! నేనడిగినచ్చినగదని యరా రాజేంద్రుఁడు పలుమారు చెప్పినను, నామె యొప్పదనియు నప్పుడు శంకను సన్నిధానమున నొనర్చిన ప్రమాణమునకు భంగముకలిగిన నేనెక్కడ నతని మానిపోవలసి వచ్చునోయను భీతిచే నాము నోహరు మంగళాంగ దర్శనమైన నిరంతరము నొనర్చుచుందునని వలదని యూఁపుచు వచ్చితి. ఇప్పుడట్లడుగుటకుముందే సంధ్యావళీదేవి యీజాబు పంపవలయునన్న నెంత మహోదారగుణము? ఎంత పారమార్థికము? ఎంత పరోపకార పరత? ఎంత యాత్మతిరస్కారము? ఇట్టి మహోదారతిలకను దర్శించుకొననే వలయుఁగదా?

(లోపలివైపుఁజూచి)

ఏమంటివి దాసీ! అక్కడనే కూర్చుండియున్నారా? ఈయువ్వరిలో సంధ్యావళి యెవరు? ఓహో! అమూల్యయున్న యీమెయా? మోము చూచిననే మహాత్మ్యము తెలియుఁగదా? (సమీపించి) సంధ్యావళీదేవి!

సంధ్యా—(స్వ) ఆహా! ఎవ్వరీ తరుణీమణి. చూడ్కికి మిఱుమిట్లు గొలుపు తేజముఁ గలిగియున్నదే? ఈమె మానవవనిత యగునా? దేవవనితయగునా?

మోహి—అమ్మా! ఈజాబే నీమహోపకారగుణమంతయు నాకుఁజాటిచెప్పె. మీనాథుఁడు నాయొద్దనుండిన కాలమున మీదాసి తెచ్చియిచ్చె అతఁడు నాచేతికిచ్చె చదివితి. నీపరోపకారసారస్యత నెఱిఁగితి. నిన్ను దర్శించుకొను కుతూహలము వొడమి నాథుని యనుమతివడసి యేతెంచితి నే మోహిని యను నచ్చరఁ జేడియను.

సంధ్యా—(శీఘ్రముగ లేచి) అమ్మా! మోహినీదేవీ! నానాథునికి నంతనురాగము గలిగించిన నీవు నాకెంతయుఁ బూజనీయవు. అమ్మా! నీవీయెడకు రావలసియుండెనా? ఒక మాట చెప్పియంపియుండిన నే వచ్చియుందునే? నీయనుగ్రహ విశేషము మమ్ము మా నాథుని భాగ్యరాశియుంగ దేవతలకైన భజనీయవైయున్న యప్సరస్తరుణివగు నీవు నాథునిఁజెట్టపట్ట వలయునన్న, నతని భాగ్యవిశేషమే కాదా? ఇంక నీయట్టి దగ్గొప్పకాంతామణితో మాకెల్లగను సపత్నీత్వము చేయవలయునన్న మాభాగ్య మెంతయనవచ్చును! కొనియాడఁదను.

మోహి—(నవ్వుచు) అమ్మా! నిన్ను దర్శించుట నాకు భాగ్యోదయమే. నీవు వ్రాసినకమ్మ చూచినవెంటనే, నీగుణము నాకెంతయు తెలిసినగాని భక్తిపొడమె. నాతప్పు లున్న క్షమింపుము. వింధ్యపర్వతమునయున్న నిష్టకామేశు భజించువేళ నీనాథుని సందర్శనము నాకు లభించె. ఎనలేని మోహాబ్ధి మునిఁగితి. ఊరక చెట్టపట్టక వనితాంతరప్రసక్తి మానుటయే కాక యేమడిగినను కాదనక యిచ్చుటయొక సమయముగా నభిలషించి ప్రమాణము చేయించుకొంటిని. ఒకయెడ మోహాతిరేకమును మఱియొకయెడ నీవు సమ్మతింపకున్నఁ బ్రమాణభంగమును నిష్ఫలభంగమును నగునని భీతియు బాధింపఁ దొట్రుపాటుపడుచున్న నీనాథుఁ బంపి ఫలమ్ము గట్టుకొంటివి. ఒక సమ్మతి యిచ్చితివి గదా? ఇంకొక సమ్మతి నిమిత్తమయి నను నేఁడిటకు నేయవచ్చితి. అదియేమన్న—

సంధ్యా—అమ్మా! సందేహించుట ఏమనుము. నీయాజ్ఞయేమైనను నెఱవేర్చెదను. నీ వడుగుటకుముందే యెట్టిదయినను నాయంగీకారమున్నదని నమ్ముము.

మోహి—అట్లయిన ధన్యనైతి. నాప్రార్థన వచించెదను. స్వామి సన్నిధిఁ బ్రమాణ మొనర్చియున్నందున నీసమ్మతిపడయక నాథుని పాణిపట్టుటకు శక్యము కాకుండెఁ గాక యది నెఱవేర్చినపిదప నాకూరిమి సమయము నే మాటుటకు నాకుఁబూర్ణస్వాతంత్ర్యము గలిగె? కావున నే దండనుండువఱకు వనితాంతర ప్రసక్తి మ్మాన

వలయునన్న సమయము చేసై వదలుకొనెన. నన్ను మీలోఁ జేరినదానిఁగాఁ దలంచి మన యందఱి యెడ నేకరీతిగా మననాథుఁడు వర్తించుటకు నీసమ్మతి కావలయునని ప్రార్థించుచుదాన.

క్షేమ { (మోహినికి నమస్కరించి) అమ్మా! మోహినీదేవీ! నీవు మాతల్లివి మమ్ము
చంద్ర { నానంద పయోరాశి ముంచితివి.

సంధ్యా—కాంతాలలామా! నీకెంత మహోదారగుణము! మాయెడ నక్కటికము కలిగి ప్రమాణమునైన మఱలించి యింతనుగ్రహింతువే! ఎంతటి ధీరగుణము! మమ్ము నీ చెల్లెండ్రఁగా దాసులఁగా నేలిన నదియేమాకుఁ బరమార్థము.

అనుబంధము 15.

(యవనిక దిగజారును.)

—:o:—

## చతుర్థాంకము—తృతీయరంగము.

---:o:---

### ఉద్యానవనము.

[ప్ర: మోహిని-రుక్మాంగదుఁడు.]

రుక్మా—అలివేణీ! చూడు మప్పుడే సాయంకాల మగుచువచ్చె. ఆచక్రవాక దంపతులకు లభింపనున్న వియోగమునకై యవి యప్పుడే తపించుచునటులున్నది.

మోహి—నాథా! ఇప్పుడు వచ్చినట్లున్నదే మనమీ యుద్యానవనమునకు! మధ్యాహ్నమున వచ్చితిమి. అప్పుడే సాయంకాలమయ్యెనా?

రుక్మా—మోహానుబంధమున్నందున మనకుఁ బ్రొద్దే తెలియదయ్యె. ఈప్రొద్దుచేత మన మోహము మరెంతయు ద్విగుణీకృతమైనది?

మోహి—అటుగాదు. మన మొక్క-యాట యాడితిమిగదా? దానివలనఁ బ్రొద్దు తోఁచకపోయినది.

(గోపల భేరీధ్వని)

నాథా! ఏమి భేరి మ్రోగుచున్నది? ఇదేమి రణభేరియా?

రుక్మా—కామినీ! ఇఁక మూఁడు దినములు నన్ను విడువుము. ఈదినము దశమి. సాయంకాలమైనది గనుక యేకాదశీ వ్రత నియమమును జాటించుచున్నారు. ఇప్పటినుండి విష్ణుధ్యాన మొనర్పవలయును. రాత్రి భోజనములేదు. రేపంతయు నుపవాసము. రాత్రి జాగరము. మఱునాఁడు సూర్యోదయమునకే పారణ. పగలంతయు నిద్ర లేకుండ నుండవలయును. మఱల రాత్రిభోజనము వర్జింపవలయును. ఈ మూఁడు రాత్రులును నీవియోగము నాకెంత చింత పుట్టించిననుఁ జేసినను హరివాసర వ్రత నిష్ఠ మానని నాకు విధి లేదు. ఇప్పటికిగియే కడముద్దుగా నుండుఁగాక (అని యాలింగనము చేసికొని ముద్దిడఁబోవ.)

మోహి—(దూరముపోయి) నాథా! ఇదియేమి పిడుగు పాటు తెచ్చితివి. ఇట్టివ్రత మొందైనఁగలదా? నీవేమో సులభముగ మూఁడుదినములంటివి. అవి నాకు మూఁడు యుగము లౌట విచారింపవైతివే? సర్వసుఖము లనుభవింప నాస్పదము గలిగించునట్టి వయసున్న కాలమున నిదియే మేకాదశి? విడువుము. ముసలితనము వచ్చినప్పు డేకాదశి నియమము లన్నియు నింక రెండునాళ్లెక్కువగా నుపవాసము నుండియైన నడిపింతువుఁట? ఇప్పుడేటికి వదలుము. నాకౌఁగిటికిరమ్ము.

రుక్మా—మోహినీ! నేనెట్టి మాటకైనఁ దాళుదుఁగాక, యీవ్రతమును మాత్రము నీవు చులుకనగ మాటలాడితివా నేనోర్వను.

మోహి—ఇదియా నీసరసము? సుఖరీతి దేవలోకమున మెలఁగుచున్న నాకు లేని యాశలు గల్పించి, లెక్కలేని ప్రమాణములుచేసి యిటు కొనివచ్చినది నీవేకాదశీ వ్రత మొనర్చి నీ శరీరము శుష్కింపఁ జేసికొని నామోహము శుష్కింపఁ జేయుట కా? ఇది నేనుమాత్ర మెట్లోర్తును? నాథా! ఏల యీ భ్రాంతి? వదలుము. అలపూఁ బొన్నుపై వినోదక్రీడల మెలఁగుదము రమ్ము.

రుక్మా—మోహినీ! ఇంకొండనకుము. ఇది నా చేతఁ గానిపని.

మోహి—రాజేంద్రా! నామాట లించుకైన జవదాఁటనని నా చెట్టపట్టితివే? ప్రమాణ మొనర్చితివే? పురుషులయొక్క మాటనిలుకడ నిప్పుఁడుగదా నాకుఁ దెలిసినది? ఘోరప్రమాణ మొనర్చి పదిదినములైనఁ గాలేదే?

రుక్మా—మనోహారిణీ! నీచరణములపైఁబడి వేఁడికొందు నన్ను మసలింపకుమా? నీమాట యెట్టిదైన నొనర్తునని ప్రమాణ మొనర్చినది నిక్కమే. ఆ ప్రమాణమునకై నా ప్రాణమైన నాకంటె నెక్కువగు నేపదార్థమైన నొసంగెదఁగాని యీ యేకాదశీ వ్రతము మాత్ర ముజ్జగింపను. అనుగ్రహించి యీ యుద్దేశము మానుమా?

మోహి—నాథా! ఒక పనికిరాని యేకాదశినాఁ డుపవాసముచేసి సగము చచ్చుట మానుమని వేఁడి నందులకు నీప్రాణమే యొసఁగెదనంటివి. ప్రమాణమైనఁ దప్పెద నంటివి?

లయగ్రాహి.

ఆలయమునందుఁగల బాలురు కుటుంబినియు
జాలిఁబడుచుండఁ జని శైలగుహలందున్
బేలవలెనుండియుఁ గపాలముగ శాసమును
గేలనొకదండమును వేలితుదదర్భల్
పోలధరియించి మృగజాలములఁగూడిఫల
మూలములుపర్ణములు గాలిభుజియింపన్
జాలిచరియించు మునిలీల నుపవాసముల
నేలమదిఁగోరెదు నృపాలకులచంద్రా.

ఇంత న్యాయ మెందైనఁగలదా? విడువరాని ప్రాణమే విడుచుట కొప్పువాఁడ వింక నన్నవలీలగా విడువఁగలవుగదా! ఇంక నే నేల యిందుండవలయు.

రుక్మా—(కోపమున) తరుణీ! అప్పుడే చీఁకటిపడియె. నేను హరిభజన మొనర్ప వలయు. ఇంకఁజాలు నీ మోహప్రసంగము, ఇంతజ్ఞానమా? భగవద్విషయమున భక్తిగలవారి నెట్లయిన నింకింత భక్తి వెలయునట్లు చేయుటమాని చెడుమార్గమునకుఁ ద్రిప్పఁ జూచుట పాడియా? ఇంతూరకుండుము. నీమాట జవదాఁటువాఁడఁ గానని నేనొనర్చిన ప్రతిజ్ఞ కర్థమిది కాదు.

మోహి—(స్వగతము) ఆహా! నేఁ గడుదూరము పోవనిచ్చితి. ఈ విభునెడ నాకుఁ గల మోహ మగ్గలముగదా! ఎట్లు మానిపోవఁజాలుదు? (లేవఁబోవ).

రుక్మా—ఏమి లేచెదవు? (చేయివట్టి నిలిపి) నీవును నాతోఁగూడ నేకాదశీ వ్రతము నాచరింపుమా? పోయి స్నాన మొనర్చిరమ్ము. భగవద్ధ్యాన మొనర్తము.

(యవనికపడును.)

—: చతుర్థాఙ్కము సమాప్తము :—

———:0:———

*

శ్రీ

# మోహినీ రుక్మాంగద నాటకము.

—:0:—

## పఞ్చమాఙ్కము-ప్రథమరంగము.

—0—

### పర్వతసానుదేశము.

[ప్ర: రంభ-ఊర్వశి-మేనక-తిలోత్తమ.]

రంభ—చెలులారా! కొంచమైనను దాక్షిణ్యముచూపక మనము బుద్ధిచెప్పవలయు.

ఊర్వశి—రానిమ్ము. దానిఁబట్టిన దయ్యము నేవిడిపించెదను.

[ప్ర: మోహినిని బిలిచికొని వరూధిని.]

వరూ—అక్కలారా! ఇదిగో యీ మోహినిని బిలిచికొనివచ్చియున్నాను. రుక్మాంగదు నిద్రపుచ్చి వచ్చియున్నది.

(మోహిని యందఱికిని నమస్కరించును).

ఊర్వశి—చాలును నిలుపుము నీనమస్కారములు. నీ విక్కడినుండిపోయి యెన్నిదినము లైనది చెప్పుము? ఆట్లేల తలవంచుకొని యున్నావు? ఏలపలుకకున్నావు?

రంభ—ఏమే మోహినీ! సిగ్గులేదా? చెప్పుము మూఁడు నెలలు కాలేదా?

మేనక—ఇంకనైన రుక్మాంగదుని పొందు తృప్తిఁడెనా-లేదా!

తిలో—అక్కడ నెవ్వరు విటులు దొరకక యిక్కడకుఁ బరుగెత్తివచ్చితివా? లేక నీ ముద్దుమోము చూచి నీపనియంతయు నేనే చేయుచు నీకు సెలవిచ్చితినా?

రంభ—కాదే మోహినీ! నీతలదన్నిన వాండ్రెందఱోయుండఁ బదిదినముల లోపల రుక్మాంగదు వ్రతము చెఱుచు యుక్తిశాలిను లెందఱోయుండ నేనీ కార్యము చేయుదునని ముందుఁబడి వచ్చితివే. ఇందులకా?

మేనక—దేవేంద్ర భోగముకంటె-సోమయాజుల భోగముకంటె-యుద్ధహత వీరుల భోగముకంటె రుక్మాంగదు భోగము నీకంత మెచ్చునకు వచ్చినదియా?

ఊర్వశి—దానితో నేమిమాటలే? ముద్దుముండ. పోదము రండు. దీని బిలుచుకొని

పోయి దేవేంద్రునకుఁ జెప్పి యిదియొనర్చిన యపరాధమునకుఁ గొన్నినాళ్లు యమ యాతనల కొప్పఁజెప్పుదము.

మోహి—అక్కలారా! నను క్షమింపుఁడు. నిక్కముగా నాకు బుద్ధిమాంద్యము గలిగెను. ఇంక మసలను. ఇదే యింక మూఁడుదినములలో నే నేకాదశి గాఁగలదు. ఎట్లయినను కార్య సాధనము గలిగించుకొని వచ్చెద. నన్ను మన్నించి విడిచిపొండు.

ఊర్వశి—ఇంక నీమాటలపై మాకు నమ్మకము గలుగఁగలదా? ఆ రుక్మాంగదుఁ జూచిన వెంటనే నీ కెదలేచి అంగలార్పఁ గలవు నీకుఁ దగినది యమలోకమే? నీ వొనరింప నున్న కార్యమునకు వేఱొకరిని నియమింతమఁట లెమ్ము. కొన్నినాళ్లు నీవు యమ లోకమునందుండి వచ్చిన నీభోగాపేక్ష శాంతమగును.

మోహి—మీకు నమస్కరించి వేఁడికొందును. నామాటైనఁ జూడుఁడు ఇన్నినా ళ్లనిపై నే మసలిన నేర మొప్పుకొందును. ఇంక మూఁడు నాళ్లకదా! నే గడువు గోరుట? అనుగ్రహించి నాకొసంగుఁడు.

మేనక—ఊర్వశీ! ఏమో మిక్కిలి చెప్పుకొనుచున్నది ఈమూఁడు దినములు గడువు నిత్తము. మోహినీ! ఈసారిమాత్రము నీవు కార్యసాధనము గావింపక కాలహరణము చేసితివా నిన్ను యమయాతనలకు నప్పగించుట తప్పదింకఁ గా మేమంద ఱము గలసి నీకొసంగఁగల యవమానమును బాధలును నీ వూహించుకొనఁ జాలవు.

రంభ—రంకునుండ. మేనుండినను జీవ వైకుంఠోత్సవమునఁ దనపని సహితము చేసి బాధపడుమనఁగా సిగ్గులేక తానొక మానవుని ప్రక్కనఁ బరుండి యానందపడు చున్నది. దీనికేటికను నే? ఈ మూఁడు దినములు విడిచిన సాధింపఁగలదనుకొంటివా? చెప్పనఁగొట్టఁ బిలుచుకొని పోవుదము మాపరాధినిని రుక్మాంగద జయమునకై పంపుదము.

తిలో—(మోహినిఁ గాలదన్ని) అవును. దీనింగృపఁజూడరాదు గను వేమిగడువు? దాని పిండము. ఈ మూఁడు నెలలు పనిపాటలులేక సౌఖ్య మనుభవించినది యింక వచ్చునా? పోదము పిలుచుకొని దేవేంద్రు నొద్దకు.

మోహి—(నమస్కరించి) అక్కలారా! నామాటనైనఁ జూడుఁడు. మూఁడు మాసములు బాధపడితినిగదా? ఇంక మూఁడు దినములకేల కక్కసించెదరు. తప్పక కార్యసాధన మొనరించి మీబాధలు మాన్పెద.

ఊర్వ—చెలులారా! పోవనిండు. ఈ మూఁడు దినములలో నేమి చెడఁగలదు. మోహినీ! అందఱి పాదములు ముట్టి యింక రుక్మాంగదునిపై మరులునఁ గార్యహాని గావింపనని ప్రమాణము చేయుము.

మో-హి—(అందఱి పాదములుముట్టి నమస్కరించి).

ఆ. వె. కోపగింపవలదు మీపాదములయాన
మూఁడునాళ్లలోన ముదముమీఱఁ
గార్యసాధనంబుఁ గావింతుమన్నింపుఁ
డరసితప్పులన్ని యక్కలార.

(ముందు యవనిక పడును.)

—— :o: ——

పఞ్చమాఙ్కము-ద్వితీయరంగము.

మోహిని పడకటిల్లు.

మోహిని పండుకొనియుండును.

[ప్ర: తిలోత్తమ.]

తిలో—(లేపి) మోహినీ! ఈ నాఁ డేకాదశి. రంభాదులగు మనవారు నిన్ను హెచ్చరించుటకై నన్ను బంపియున్నారు. అప్పుడే సాయంకాలము కావచ్చె. ఈరాత్రి లోపల నీవొనరింపఁదగిన కార్యము నొనరింపక పోయితివా తత్ఫలమును గుఱించి చెప్పఁ బనియే లేదుగదా? మహోత్సాహమున మేమందఱము విమానములపైనుండి నీకార్యము నిరీక్షించు చుందుమని వచింపుమనిరి. రేపు సాయంకాలమునకు ముందే నీవే తెంచి మమ్ముఁ గలిసికొనవలయునని చెప్పుమనిరి. హెచ్చరిక!

(నిష్క్రమించును).

[ప్ర: రుక్మాంగదుఁడు.]

రుక్మా—(స్వగతము) ఏమికారణమో తెలియకున్నది. హరిభజన మొనర్చుచు జాగరము సేయుటకై వచ్చుచుండిన మోహిని యీనాఁడు రాదయ్యె. పోయి విచారింతుఁగాక (మోహిని యొద్దకువచ్చి) మోహినీ! అదేల శయనించియున్నావు. పద్మనాభ దేవాలయమునకుఁ బోవలసి యున్నదిగదా? ఏకాదశినాఁడు పడకపై శయనింతువే? నీకేమి బాధకలిగె?

మోహి—మనోహరా! నాకుఁ గలిగియున్న బాధ యింతంతనఁజాలుదునా. అదితీర్ప నీ చే నున్నది.

రుక్మా—ఆహా! మోహినీ! నేఁడేమి క్రొత్తమాటవింటిని? నీకుబాధగలిగి నేతీర్ప సాధ్యమున్న యోచింపవలయునా? నీవింత యాజ్ఞాపించినఁ జాలుఁగదా?

మోహి—నాథా! నీవనుటకేమి. ఉపచారమునకిట్లాడెదవుగాక నిక్క-ముగా నీవొనరించుటకు సంశయింతువని బాధపడుచున్నాను.

రుక్మా—తరుణీరత్నమా! నీవిట్లన్న నేనేమన నేర్తును? నీయెడ నాకుఁగల పూర్ణమోహము నెంత సంశయించినట్టులయ్యె. అది యటుండుఁగాక. ఇష్టకామేశు సన్నిధానమున నీమాట యేదియున్నను జవదాఁటువాఁడఁ గానని ఘోరప్రమాణము నొనర్చితినే? దానినెట్లు మఱవసాధ్యము?

మోహి—మోహమునకేమి? ప్రశంసనీయుమగు నీదక్షిణ నాయకత్వము నిను జేపట్టిన యందఱి యెడను నేకరీతిగా మోహ చాతుర్యమే గావించు. ఇంకఁ బ్రమాణమన్ననో పురుషులు రాజులును నగువారికి లక్ష్యముండఁగలదా? వీరెల్ల వారి జాతులందును వైవాహికములందును ప్రాణవిత్తమానములభంగమందును జకిత గోకులాగ్రజన్మగతులయందును బొంకినను నఘము పొందదని వగుర్చుకొని యున్నారే? మీకు బొంకఁగూడని విషయమే లేదు. అన్నియు నిందులోనే యణఁగి యున్నవి.

రుక్మా—దేవీ! ఇదియేమి యీనాఁడిట్లు పరీక్ష చేయసాగితివి. అప్పుడె పదిగడియల రాత్రియయ్యె. ఏకాదశీ పుణ్యకథ వేళ మీఱనయ్యె. చెప్పుము నీయభీష్టమైన నేమి? నాకు సాధ్యమున్న నవశ్యము నెఱవేర్చెద. దేవాలయమునకుఁ బోవు వేళయయ్యె.

మోహి—ఇప్పటికైన నిది ప్రమాణమేనా? నమ్మవచ్చునా?

రుక్మా—నమ్ముము నీయాన-నాయాన, యీయుమేశునాన నెఱవేర్చెదను. ఎట్టి ఘనకార్యమైన నొనరింపఁ బ్రయత్నించెద.

మోహి—ఘనకార్య మొక్క-టికాదు. అఘటన మేమియులేదు, నాథా! చెఱకు విలుకాని బాధకు సహింపఁజాలక యన్యథా శరణముఁ గానక నిను వేఁడవలసి వచ్చియున్నది.

## అనుబంధము 16.

రుక్మా—(చెవులు మూసికొని) హా! నారాయణ! నారాయణ! పాపము శాంతమగుఁ గాక, పాపముశాంతమగుఁగాక. మోహినీ! ఇదేమి మొఱకుఁదనము? ఈనాఁ

దేకాదశి యగుట మఱచితివా? దినదినము కాలముగలదే? నేఁడును ఱేపు ద్వాదశియుఁ బోనిమ్ము. ఇష్టవిధానమున ననంగ క్రీడలఁ దేలుదము గాక. తప్పాడితి ననుము. ఈమాట యుజ్జగింపుము.

మోహిని—ఆహా! దైవమా! నే నెంత నమ్మియుంటి? ఇష్టకామేశు నాలయమున నాన యొనర్చినందున కిదిఫలమా? నిమిషమునకుముందు నాయభీష్టమెట్టిదైనను జెల్లింతునని వచించిన సత్యమున కిదిఫలమా? పనికిరాని యొక యేకాదశీ వ్రతమునకే యింత యసత్య మాడవలయునన్న నింక నాయాభీష్టము నీ వెట్లు చెల్లింపఁగలవు? ఎట్టి ప్రమాణ మొనర్చినను సత్యభాషణము నిలుపఁజాలవని నిన్ను సంశయించినది నిర్హేతుకము కాదుకదా? అయ్యో! నే నెంత నమ్మితిని! ఆ యిష్టకామేశుని దర్శింపుకొను బుద్ధి నాకు నాఁడేల పొడమె? పొడమెఁగాక వచ్చినదాన నీరాజన్యు నేల చూచితి? చూచితిఁగాక నాకీ పృథివీపతిపై మోహము జనింపనేల? జనించినంత నే యాఁచుకొని నేసమ్మతింప నంటినే? ఆ పట్టె పూర్ణముగాఁ గొనసఱకు సాధింపక యతని ప్రార్థన నియ్యకొంటి నేల? ఇయ్యకొన్నను నామాట పాటించునని నమ్మితి నేల? ఘనావరుల వృత్తాంతము తెలియుఁ బూర్ణముగా నెఱిఁగియుండియు నీ భూవిభుఁ డొనర్చిన ప్రమాణమును విశ్వసించితి నేల? అకటా! ఎంత బేలనైతిని? ఎంత యాపదకు గుఱియైతిని. ఎంత క్రుంగిపోయితిని? సరివారిలో నెంత పలుచఁదనము దెచ్చుకొంటిని. ఎన్నెన్నో యాజ్ఞము లెన్నెన్నో ఘనకార్యములు ప్రకటించిన మానవులకుఁ గాక చిక్కని నాయట్టి యప్సరస యొక రాజమాత్రునికి సశరీర సుఖమిన్వఁ దలపడి వచ్చినందులకు నాకుఁ దగిన శిక్షయే కదా? రాజేంద్రా! ఇంకానతిమ్ము. నీప్రమాణమునమ్మిన వివేక శూన్యతకు నాకుఁ దగినశిక్ష యొసంగితివి. నీపూర్వ జన్మమున నొనర్చిన తపఃఫలమున నీ మాటలకు బేలపోయి నీకిన్నినాళ్లు చిక్కియుంటి ఇంక నే వెడలిపోయెద. నీమాట నీకొప్పఁ జెప్పెద. మాయప్సరస్త్రీలకెల్ల నీయమోఘ సత్యనియమము వచించి నాయొక్కదాని చేటువలన వారి నందఱి నిట్లు మోసపోవకుండ నొనర్చెద. (లేచును).

రుక్మా—తరుణీజనావతంసమా! నీవిట్లాడుట పాడియా? నాల్గుమాసములనుండి ననుఁ బాలించుచువచ్చితివే? ఒక్కనాఁడైన నాయెడ నపరాధమునకుఁ గారణముండెనే? మీఱరాని యేకాదశీ వ్రతము గాక, నీయభీష్టము చెల్లించకుందునే? నీకుఁ గన్నీ రేల కలిగె? నన్ను మన్నింపుము. నాయపరాధముల క్షమింపుము. ఇది నాకు సాధ్యము కానిపని. చూచితివా! నీకిట్టి ప్రణయకోపము కలిగినవేళ నిన్ను గౌఁగిలించుటకును, నీకన్నీరు ముద్దాడుటకును, నీ చెక్కులంటి-చేతులంటి-చరణములంటి వేఁడుకొని యూఱార్చుటయును నీ యేకాదశీ వ్రతమే యభ్యంతర పఱచుచున్నదిగదా?

సీ. ఘనవేణినీ చెక్కుఁగవనంటినామోహ
మొగిఁదెలుపంగ లేకున్న వాఁడ
వనజాయతాక్షినీ ప్రణయకోపముఁదీఱ
నిన్ను గౌఁగిటఁజేర్పకున్న వాఁడఁ
దరళాక్షినీమోహపరితాపమారసీ
కన్నీరు ముద్దాడకున్న వాఁడ
మానినీమణినన్ను మన్నింపుమనికాళ్ల
నొరఁగివేఁడఁగఁజాలకున్న వాఁడ

గీ. వదలరానియేకాదశీవ్రతముగాక
కారణంబొండుగలుగదు సారసాక్షి
బాసఁజేసెదనింతైనమోసమెఱుఁగ
నన్ను మన్నింపవే మదనాగయాన.

మోహి—నరేంద్రా! నీవుగు, నీయేకాదశియు సౌఖ్యముగానుండుఁడు. నాకేల యింక నీగొడవ? నీవేకాదశి నే పెండ్లిగూడితివి గాక, నాచెట్టపట్టితివా? ఎల్లను బోయెదఁ గదా! నాకేమియుఁ గొదవగలుగదు కాని నిను జూచిన, నత్యంతమగు దుఃఖము గలిగెను. భూరమణా! మీపూర్వికులు సత్యరక్షణమునకై యెన్నినో కార్యము లొనర్చిరి. తమప్రాణములనైత మిచ్చిరి. లోకమున నెందఱు రాజులుండలేదు? ఎందఱు చక్రవర్తులుండలేదు? ఎంతపాటుపడి, యెన్ని దుఃఖములకోర్చి, వారు సత్యధర్మమును రక్షించిరి. నీవు మూఢుఁడవై, యరకాసుచేయని యేకాదశీవ్రతమునకని విడువరాని సత్యవ్రతము నవివేకివై విడిచెదవేయని పరితాప పడుచున్న దాన. ఇది రేఁగుఁబండ్లు కొనుటకు ముత్యములు పోసినట్లయ్యెఁగదా? నీకర్మమునకు నే నేమి చేయుదానని? అసత్యపాపము నొప్పుకొంటివా? ప్రమాణభిక్షదికియ్యకొంటివా? వచింపుము కడమాట. నేఁబోయెద.

రుక్మాం—ఇది నా దుష్ప్రాప్తియనవలయునా? లేక నీ దుశ్చరిత మనవలయునా? నాప్రాణములైనఁ దృణప్రాయముగ విడుతుఁ గాక, యసత్యపాపమునకు నేనియ్యకొందునా?

మోహిని—మాటలాడితివి గాక, కార్యమున నేమి చూపితివి?

రుక్మాం—తరుణీ! ఇంకనూరకుండుము. నాకుఁ గోపమువచ్చును. సభక్తితాత్పర్యమున విష్ణుసేవయొనర్చుచుఁ దిరుగరాని మానసముతో నిశ్చలనిష్ఠ నేకాదశీ వ్రతము జరుపుచున్న

నాకు వ్రతభంగ మొనర్చురీతి నిట్టికోరిక కోరెదవా? అడివలదనిన నాకు సత్యభంగమా? చాలు నీచాతుర్యము. నేనసత్యవాదినైన, హరివాసరమున నీతో రమింప సత్యవ్రతుండగు పతినే కోరుకొనుము ఇంకనైన నేమి?

మోహిని—రాజేంద్రా! నీసాహసమును, నీవాచాలత్వమును నెంతనవలెను. అసత్యమాడియు, నందునకుఁ గుందుటమాని నాపైననే తిరుగుబడి ప్రమాణములు సరకుగొనక, యసత్యముకాదని వాదించెదవే? ఇంక నాపై- నన్నే కోపగించెదవే? ఇది జాణతనము కాదా? పోనిమ్ము. ఇది ప్రమాణమైనదియు నప్రమాణమైనదియు, దీర్చువారు దేంము లేకుందురా? అదితరువాత విచారింతమఁట. ఇప్పుడైన వచింపుము. నామాటయెట్టిదైనను, జవదాఁటనని స్వామికోవెలయందుఁ జేసిన ప్రమాణమును బట్టి సాధించెద. నేను నేఁడే కాదశిగాయైనను, నేమైనను నిన్ను విడువను,

రుక్మా—మోహినీ! నావ్రతనైష్ఠికత నిన్ని దినములు చూచియు, నీ వెఱుఁగవైతివా. ఇది నాకు సాధ్యమగునా?

## అనుబంధము 17.

కలసియున్న నా రాజ్యమంతయు నీకొసంగి యడవుఁ జేరుమనుము. నాభార్యలనెల్ల నీకు దాసులంగానొనర్చి యూడిగము చేయింపుము నాకుత్తుకయైనను, నాకొమారు కుత్తుకనైనను, ఖండించి నీయెదుటఁ బెట్టుమనుము. ఏదైననొనర్తుఁగాక, యీ వ్రతోపసంహారము మాత్రము నాచేతఁ గాదు.

మోహిని—నిక్కమా? ఇదితప్ప నీవింకేమైనను నడిగిన నీయఁగలవా? ఇత్తువా? ఇదినైనఁ బ్రమాణవచనమేనా?

రుక్మా—నీవే ప్రమాణము చేయుమన్నను జేసి తప్పక యొసంగుదును.

మోహిని—అట్లయిన కానిమ్ము. నీవు నీకొడుకు తలకోసి యిచ్చెదనని వచించితివి కదా? ఆ కార్యమొనరింపుము.

రుక్మా—హా! దైవమా! (అని మూర్ఛిల్లును)

మోహిని—(రుక్మాంగదునకు శిశిరోపచారములు చేయుచు) రాజేంద్రా! రాజేంద్రా! అహా! ఎంత కార్యమాయెను. సేవకా!

[ప్రః సేవకుఁడు.]

నీవీక్షణమునఁ బోయి రాజుగారు మూర్ఛిల్లియున్నారని చెప్పి తగిన యౌషధములు తీసుకొని రాజవైద్యుని రమ్మనుము. అహా! నే నెంత కూరకృత్యమొనర్చితి. నామనోనాథున కెంత యాపదగలుగునట్లొనర్చితి. అచ్చరలలో నెందఱో యుండిరి గదా! నేనేల యీవ్రతభంగ కార్యమునకుఁబూనితి.

[ప్ర: తిలోత్తమ (పైనుండివచ్చి)]

తిలో—మోహినీ! పైనుండి నేచుంచఱను వినుచున్నారము. మంచిమార్గముఁబట్టితివి. మన కార్య సాధనమునకు నిదియేసమయము. ఇదియేదారి. తిరిగితివా! పనితప్పును. భద్రము. భద్రముసుమా? (నిష్క్రమించును.)

[ప్ర: (శీఘ్రగమనమున) రాజవైద్యుఁడు సంధ్యావళి-కోమల చంద్రకాంత-ధర్మాంగదుఁడు.]

సంధ్యా—అమ్మా! మోహినీదేవీ! ఏల యీరాజన్యున కీమూర్ఛగలిగె?

మోహిని—వైద్యచంద్రమా! ఏదేనిచికిత్సయొనర్పుము. తెలివిగలిగింపుము. అమ్మా సంధ్యావళీ! దాఁప నేలచెప్పెదను. నేనీరాజన్యు నొకస్వల్పకార్యమపేక్షించితి. అదితన యేకాదశీవ్రతమునకు భంగముకలిగించునని యొసఁగఁడయ్యె. నామాటమీఱఁడని యతఁడొనర్చిన ప్రమాణమును నిర్బంధించితి ఏమన్ననుమానక తనకొడుకు కుత్తుకనైనఁగోసియిత్తుఁగాక యీ కార్యమునేఁ జేయనని మనస్వీగా నను గోపగించుకొని మాటలాడె నేనును నీకొడుకు కుత్తుకయేకోసి యిమ్మంటి మూర్ఛిల్లియున్నాఁడు.

కోమల చంద్రి — ఓసి! దురాత్మురాలా! ఓసిగయ్యాళి ఇదెట్టికోరికయే? సుకుమారు కంఠచ్ఛేదన మొనర్చుటకు రాజేంద్రుఁడెట్లొఁర్వఁగలఁడు ఇంతదౌరాత్మ్య మెందైన వింటిమే?

(వైద్యుఁ డుపచారము చేయఁగా రాజునకుఁ దెలివిగలిగి లేచి కూర్చుండును).

రుక్మాం—హా! మోహినీ! నా కెంతటిపెనుగుపాటు గలిగించితివి. సతీమణులారా! మీయవచ్చినయెంత సేపైనది? మోహినీ! నీక్రూరకృత్యము మానితివనుము. తప్పాడితివనుము. నిర్బంధము మానుము. నాపైఁగరుణ రానిమ్ము.

సంధ్యా—మోహినీదేవీ! చేయరాని కార్యములు చేయుమనిపతిని నిర్బంధపెట్టుట పాతివ్రత్యమునకే భంగము కలిగించునదికదా?

సీ. కామినీమణికి మంగళసూత్రమే చాలు
శృంగారముల కెల్లఁ జెలువుచూప
ధవళలోచనకు నైదువతనంబె చాలు
వైభవంబుల కెల్ల వన్నెఁబెట్ట
నంబుజాననకుఁ బుణ్యాంగనాత్వమే చాలు
రాజసంబుల కెల్లఁ దేజమొసఁగ
సతికి నాథుఁడు దృఢస్థితినుండుటే చాలు
భాగ్యలక్ష్ముల కెల్లఁ బ్రభఁ దనర్ప

గీ. నెన్నిజన్మములందుఁ బద్మేక్షణాలకుఁ
బతిహితంబునకంటె శోభనముగలదె
యిహపరములిచ్చు హృదయేశుమహిమ దలియ
కధిపుమదినొవ్వఁ జేయుట యుక్తమగునె

మోహిని—నీధర్మోపదేశము నాకు ననపేక్షితము. పాతివ్రత్యమంతయు నీవేయొంటిఁగొన్న దానవనుకొంటివో! రాజేంద్రా! ఏదైననొకటి నీవొనర్పకున్నఁ దీఱదు. వ్రతము మానెదవా? కొడుకుం జంపెదవా?

కోమల—నాథా! దీనికేలయిట్టియున్నతి? దీనిమాటజరుపకున్న జగత్ప్రళయము కాఁగలదా? తొలఁగింపుము నీయింటినుండి? ఇట్టిక్రూరచింతయొనర్చుదాని నాదరింప వచ్చునా?

చంద్రికా—ఇదికోరినకోరిక జరుప నేవలయుననునంత నిర్బంధమేమి? ఎవతెయైనను, గొడుకుంజంపుమని నిర్బంధపెట్టుదుర్జాతి గలుగునే?

మోహిని—సవతులారా! మీకేమి కావరము హెచ్చినదా? నోటికడ్డులేక మాటలాడుచున్నారు? మిమ్ము న్యాయము తీర్పఁడనియెవ్వరైనఁ బిలిచిరా? పిలువని పేరంటముగావచ్చి, కాలులువల్ల సాగితిరా? ఊరకనాలుక బిగఁబట్టి పడి యుండుఁడమ్మ. మిమ్మెవ్వరునీతులడుగలేదు.

కోమల—వేశ్యా! ఇది నీకులము తప్పితముకాని నీతప్పితముకాదు కన్నవారిఁగలపి మోహమన్నమాట మూలఁబెట్టి మనఁగలసామాన్యకు నెక్కటికముగలదా? సదసద్వివేకము గలదా?

మోహిని—ఛీ నే! సిగ్గులేక పతియెదుటనే వేశ్యతో సరిగట్టుకొని నాట్యమొనర్చినట్టు మాటలాడితివే? నీవు ప్రచ్ఛన్న వేశ్యవు గావా?

సంధ్యా—అమ్మలారా! మీరేలవాదించుకొనియెదరు. నిలువుఁడు.

మోహిని—రాజచంద్రా! నాకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకుఁ జేతఁగాక నాసవతులఁ గ్రమ్మించి నను దిట్టింపసాగితివా? నాకేమియువలదు. సత్యముజరుపలేక పోయితివనుము. మాటయిచ్చి తప్పితివనుము. ఆమాటాడుము. నాకింకేమియువలదు. ఇట్టే వెడలి పోయెద.

ధర్మాంగ—జనకా! నీవేలయోచించెదవు? వ్రతభంగమైన నాప్రాణమైనఁగదా మాపిన్న తల్లి మోహినీదేవికోరికొనుట? ఎన్నిదినములనుండియో, యాచరించుచుండిన యీ వ్రతముమానుటకగునా? చెప్పరానిదోషము సిద్ధించుఁగదా? ఇంక నాకొఱకా? నీవేల యోచింతువు. క్షణభంగురమైన యీప్రాణము వ్రతమునిలుపుటకై త్యజించి పరమ పావనమగు హరివాసరమునాఁడు నారాయణచరణసన్నిధికిఁ బోవనెంచుటకు, నాకు

జన్మజన్మాంతరగతపఃఫలముకదా? అదియెట్లులభింపవలయును?, నేసంతసమునన్బొం
దెదద. నీవింతయు యోచింపకుము. ఎత్తుము నీకరవాలము! నన్ను ఖండించి
నాకుఁబుణ్యగతి నొసంగి, వ్రతముస్థాపింపుము మాతల్లులును నీవును సుఖముననున్న
నాయట్టిపుత్రులు నీకెందఱో గలుగవచ్చు. సంశయింపకుము.

రుక్మాం—హా! దైవమా!

మోహిని—కుమారా! అరకాలు చేయని వ్రతమునకై, నీప్రాణములుపోఁగొట్టుకొన
నుద్యమించితివా?

అనుబంధము 18.

ఇదెట్టి వివేకము?

సంధ్యా—రాజచంద్రా! ఈమోహినీదేవిమాట యెట్టిదైనను, జవదాఁటనని ప్రమాణమొ
సంగియుంటివి. ఏమి దైవప్రేరణమో యాయమనీవ్రతభంగమొనర్పనభిలషించినది.
దానికొప్పక నీకొడుకునైనఁ దలకోయుటకు నిశ్చయించితివి. అదియేపట్టుగా నాయమ
నిర్బంధింపఁదొడఁగ వినియుండు ధర్మసూక్ష్మమేదియు లేదు. నీవుసత్యముపరిపాలింప నే
వలయు.

చ. తనువులుఁ గోడరాపుతుదఁ దామరసాక్షులశాశ్వతల్ గరుల్
ధనములు రాజ్యసౌఖ్యము వృథా సహజన్ములు బంధుమిత్రులున్
దనయులు మిథ్య యెంతయు ముదంబునఁ జేసిన ధర్మమొక్కటే
మనుజవరేణ్య నిల్చునది మానవకోటికి నెల్లకాలమున్.

ఈకుమారుఁడును ధీరమానసమునఁ దానొప్పగించుకొనుమ వ్రతమును గాపాడుమని
నిండుయోచనతోఁ బలికె. కావున సత్యపాలనమునకై పుత్రమారణకృత్యమైనఁ
జేయఁదగియేయున్నది. (ధర్మాంగదుని కౌఁగిలించి) తనూజా! నీవుగదా సత్పుత్రుఁడవు.
పుణ్యదినమగు హరివాసరవ్రతము భంగములేకుండనిలిపి పుణ్యలోకగతి వడయుటకు
నీవుద్యమించితివి. ఇంతకంటె భాగ్యముకలదా? చిఱుతవాఁడవయ్యు జ్ఞానాధికత
గలిగి తలిదండ్రులకింత ప్రీతియొనరుత్తే! నీయట్టిసుతుఁగనుటచే, నేవీరమాతనైతి.
ధన్యనైతి. అయిన నీకుఁబెండ్లిమొదలగు కార్యములు గావించి, పెద్దవాఁడవై, కొడుకు
లఁగాంచి సుఖించుచుండునదిచూచి, యానందింపలేక పోయితినేయని యంతమాత్రము
పొక్కుచున్నదాన. (కన్నీరునించి ముద్దాడును).

రుక్మాం—హా! దైవమా! నాకెట్టిపాపిష్ఠిఁదెచ్చితివి.

ధర్మాంగ—జనకా! నీవుపాపకృతునిభంగి నిట్లుయోచింతువేల? లోకమున నెల్లధర్మములు
సత్యమునకంటె నెక్కుడు కాదు? ఎన్నికష్టము లనుభవించియైనను, నెన్నికష్టములు

పడియైనను సత్యము కాపాడకున్నఫలమేమి? నేనెన్నిదినములు బ్రతికినను హరిప్రీతిగాఁ బ్రాణము లొసంగునంతపుణ్యము నాకుఁ గలుగనేర్చునే? జనకా! ఇంతైనఁ బోధింపకుము. నిగ్రహముఁ గలిగి సత్యము పాలించి, నన్ను వధించి నాకును మాపినతల్లికిని సంతసము నింపుము.

మోహిని—

క. కలిమికి రాజ్యవిభూతికి
నిలవ్రతములు సేయుటెల్ల నీగతిఁ బావక్
వలనదు ప్రాణముగల్గిన
బలుసాకులుదినియైనను బ్రదుకఁగవచ్చున్.

చచ్చినపిదప నేటిసద్గతి? నీవుపసివాఁడవు. అరయనేరవు. మేఘములనమ్మి చెఱువు నీటినిజల్లించుకొనువా రెందురా?

ధర్మాంగ—మాతా! దేవవనితవై సర్వశాస్త్రములు నెఱిఁగిననీ వీమాట యాడవచ్చునా?

అనుబంధము 19.

జనకా! లెమ్ము.

మోహిని—సంధ్యావళీదేవీ! నీవైనను జెప్పుము.

కం. అర్కోపైకంబును జేయుని
హరివాసరమునకునై నిజాత్మజుదునుమన్
గరవాలంబునుబూనెడు
కరణి యినుపమొలకు మేడఁగాల్చుటకాదే.

ఈ వ్రతము మిమ్ముద్ధరించునదేమి?

సంధ్యా—మమ్ముద్ధరించుటటుండనిమ్ము. ఆవ్రతము నీకొనర్చినకీడైననేమి? ఇంతదానిపైఁ బగఁబట్టితివి? ఈ పవిత్రము భంగపఱచుటకే నీవు కంకణముకట్టి యిందువచ్చినట్లు తోఁచుచున్నది. నాథా! వ్రతమును, సత్యమును రెండును నిలుపుము.

రుక్మా—ఆహా! నాకిప్పుడు జ్ఞప్తికివచ్చె. ఈమోహిని వచ్చిన యెనిమిది పదిదినములకే, యేకాదశివచ్చె. ఆనాఁడునన్నెంతో నిర్బంధపెట్టె. అప్పటికొకరీతిఁ జాలించి యిపుడింతనిక్కచ్చియొనర్చుటకుఁ బ్రారంభించియున్నది. ఇందేమోయున్నది. నాదుర్విధియేయీమార్గమున, నాకు వ్రతభంగము ఘటించి కీడెంచినట్లున్నది. కానిమ్ము మోహినీ! నీ వూఱడిల్లుము. నేసత్యవాదినగుటయుఁ గాకుండుటయు నీవెఱుఁగఁగలవు. కుమారా! రమ్ము.

ధర్మాంగ—(చేతులుజోడించికొని తండ్రియొద్దకుఁబోయి నిలిచి) పరమేశా! నన్ను నీ సన్నిధికిఁగొమ్ము. మాతండ్రికట్టిపాపమును గలుగకుండ వ్రతస్థాపనము చేయింపుము. స్వామీ! ఇదె నమస్కరించువాఁడ. (నమస్కరించి) అమ్మలారా! మీరెల్ల ధైర్యము వహింపుఁడు. మీ పుత్రునికి సద్గతిగలుగనున్నదే యనియానందింపుఁడు.

## అనుబంధము 20.

(బోరగిలఁబండుకొనును.)

రక్షా—(ఖడ్గము చేఁబట్టిలేచి) రమారమణా! ఇదే నేఁబ్రతినచెల్లించువాఁడ వ్రతభంగమునకు మనసొప్పక యసత్యపాపమునకుఁగోసి, నాసుతుని ఖండించువాఁడ. ఇదెంత క్రూరకృత్యమైనను, సత్యభంగమునకంటె మించినది కాదని నమ్మి, యీ కార్యమొనర్చువాఁడ. పరమేశా! నాకు ధైర్యము పుట్టిల్లఁజేయుము. తిరుగుఁబాటు జనించునట్లొనర్పకుము. నీపాదముల నే సభక్తితాత్పర్యమునఁ బూజించువాఁడనేని, నిశ్చలమానసమున నీకుఁ బ్రీతిగా నీయేకాదశీవ్రతము నే సలుపుదునేని, యెల్లవేళల నసత్యమున్నఁ గంటగించువాఁడనేని, మానసమున నెపుడును బరోపకారము చింతించువాఁడనేని, కృత్రిమవిధానము లేక నిష్కళంకపు దైవభక్తి కలవాఁడనేని, యనవరతము భూతదయ నాకుఁ గలదేని, వెలలేని నీయనుగ్రహము నేఁ బడసినవాఁడనేని, నాకేమియుఁ బాపము గలుగకుండ సత్యము నిలిపి వ్రతభంగము లేకుండ ననుగాపాడుము (కత్తియెత్తి) ఆహా! హస్తమా! నీవు నాకెంతయుపయోగకారివైయున్నావు. హరిపాదసరోజపూజ యొనర్చుటకు నీవేకదా నాకాధారమవు? ఆశ్రితతృప్తిగా సర్వదానములొనర్చుటకు నీవేకదా మూలమవు? గోబ్రాహ్మణార్తసంరక్షణార్థమై యరినిధన మొనర్చుటకు నీవేకదా నాకుఁ దోడవు? అతిథులకుఁ బెద్దలకు శుశ్రూషలొనర్చుటకు నీవేకదా నాకు సహాయమవు? నీతో నెన్ని తపములో, యెన్ని యజ్ఞములో, యెన్ని దేవపూజలో, యొనర్చి లేక లేక, పడసిన నాయేకపుత్రుని సంహారమొనరింపింతునని నే కలనైనఁ దలంపనైతిఁగదా? ఇప్పుడా కార్యమొనర్పనుంకించితిని ఇదియంతయు సత్యమునకై యొనర్చుట కావున నీవు శంకింపకుము. ఎన్ని దురవస్థలో, యెన్ని మనఃక్లేశములో, యెన్ని శరీరకష్టములకైన నోర్చి సత్యము పరిపాలింపవలయుఁగదా? ఆసత్యపరిపాలనానంద మేకపుత్రమరణదుఃఖమునకంటె నూఱుమడుంగు లెక్కువయగుఁగదా? కానిమ్ము. నీపని యొనర్పుము. హృదయమా! నీవించుకైనఁ గళవళింపకుము. పూర్ణభావమున సత్యస్థాపనమునకై కడఁగుము. భ్రాంతిమై దారాపుత్రులని సంబంధము లేనివారియెడ మోహమునించి ప్రవర్తింతుముగాక ఇవియంతయుఁ గలలోని నటనములని యెఱుఁగఁజాలక యున్నాము. పుత్రుఁడెక్కడ? జనకుఁడెవ్వఁడు? ఒకరు నిలుచువారు కారు. సత్యమొక్కటియే నిలుచునది. సత్యమొక్కటియే ప్రజ్వలించి ప్రకాశించునది. ధర్మమొక్కటియే పొడమాపునది. కావున నీవింతైన వెనుదీయక నాచేత నీకార్యమొనరింపఁజేయుము.

కన్నులారా! మీరు నీరు నింపకుఁడు. జితేంద్రియత్వమున ధర్మస్థాపన మొనర్చుటకై యెట్టిసంకటములు నించుకార్యమయినఁ జేయఁగల సమయముకాని శోకమునకు సమయముకాదు. మనోహరైక పుత్రసంహార మొనర్చు కార్యమే మే మెట్లు చూడఁగలమని మీ రాలోచింపకుఁడు. నశ్వరమైన యైహికఫలము లభింపకున్న మానెఁగాక యీ కార్యమున ననశ్వరమైన యాముష్మికఫలము తప్పక లభింపనున్నది కావున మీరు జాగరూకతస్మై యశ్రునిర్బంధము లేక చూచి కార్య మొనర్పుఁడు, ఇదే యింకఁ గార్య మొనర్చెద. (ధ్యాన మొనర్చి భగవంతుని చేర్కొని) శ్రీహరీ! (అని యఱచి ఖడ్గ మెత్తును).

[పైనుండి ప్రః విష్ణువు-లక్ష్మి.]

విష్ణు—ఆహా! రుక్మాంగదా! మెచ్చితి. మెచ్చితి. నిలువుము.

మ॥ అరరే మెచ్చితిమెచ్చితిన్ దలఁపఁగా నత్యద్భుతంబయ్యె నీ
చరితం బీగతి సద్వ్రతాచరణముల్ సాధించువారుందు రే
కరుణన్ బూనక దానికై నిజసుతున్ ఖండింప నుంకించితే
సరిమీతెంగద సాహసోద్యమమికన్ జాలింపు రుక్మాంగదా.

(అందఱు సాష్టాంగ నమస్కృతు లొనర్చెదరు)

విష్ణు—రుక్మాంగదా! నీమహిమ మసమానము ఎవరును నీయట్టి సమోదార్య ముగలవారుండుటరిది. వ్రతముకొఱకై యిన్ని నియమములు జరిపిరి పైనఁ బలినోసంగ నాద్యమించితివి మాయురే! నీయట్టి సత్యశీలుఁడున్నే? మీ యెల్లరయెడ నా కత్యంతానుగ్రహము గలిగె. కొన్ని దినములలో నిను నాలోకమునకుంగొని యున్నత పదవి యొసంగెద. ఏడెనిమిదేఁడుల బాలుఁడయ్యు నీకుమారుఁ డొనర్చిన యాత్మత్యాగ సాహస మెంతయుఁ గొండాడఁదగియున్నది. డెబ్బది యేండ్లవారికైన నిట్టి తృణీకృత దేహత్వము సిద్ధించునా? ఇతఁడును బహు సంవత్సరములు రాజ్యమేలి నాయెడ కేతెంచి నీతో నుండఁగలవాఁడు. నీపట్టమహిషి సంధ్యావళి యుదారగుణమును నా పతిభక్తియు వ్రతభక్తియు సత్యాభిలాషమును నింతను గొండాడఁదగియున్నది. కాకున్న తనయొక్క పుత్రు-ముద్దుపట్టి నెనిమిదేఁడుల పాపని దానికై పాకార్చుకొనుట కొప్పియుండునా? ఆమెకు సద్గతియే కలుగఁగలదు. ఈమోహినియు నొకకారణమున నీకు వ్రతభంగముకలిగించు నుద్దేశమున విట్టిపూనిక చూపినదిగాక క్రూర మానసము వహించినదికాదు. నీసంసర్గము కలిగియుండుటఁజేసి యీమెన్వికిఁ బుణ్యము లభింపవలసియే యున్నది. అమరవనితయై నందున నీచెలువకు నా లోకమునకు

సశరీరముగా వచ్చుటకొక్కొక్కవేళ లభించుఁగాన నీసంసర్గమున నీపుణ్యప్రాప్తి చేనొసంగెద. ఏకాదశీవ్రతము సాంతముగా జరిపినవారు ద్వాదశి పగటివేళ నిద్రించినవారికిఁ దద్వ్రతఫలము లభింపకుండుఁగదా? ఆఫలమెల్ల నీ మోహినీ సతికి లభింప ననుగ్రహించెద. తన్మూలమున నాలోకమునకు నిరాటంకముగా వచ్చుటకును నప్పుడప్పుడు నాదర్శనము లభించుటకును స్వాతంత్ర్యము గలియుండుఁగాక. రాజేంద్రా! నీకు శుభమగుఁగాక.

అందఱు—(సాష్టాంగనమస్కారమొనర్చెదరు.)

లక్ష్మి— అనుబంధము 21.

రుక్మాం—దండకము:—జయజయజయలోకనాథా! బుధారాధ్యవేధోనిలింపాదినాథాదివంద్యా-పరబ్రహ్మవీవే-జగత్కర్తవీవే-పరేశుండవీవే-గిరీశుండవీవే-సురేశుండవీవే-దిగీశుండవీవే-జగత్సాక్షివీవే-త్రికాలుండవీవే-త్రిలోకుండవీవే-త్రిరూపుండవీవే-త్రివాచ్యుండవీవే-త్రివంద్యుండవీవే-త్రిదూరుండవీవే-చరాత్ముండవీవే-స్థిరాత్ముండవీవే-సమస్తప్రపంచంబులందున్న జంతుప్రకాండంబులందున్న తేజోవిలాసుండవీవే-జగద్గర్భ నిన్నున్నుతింపంగ నేనెంతవాఁడన్, గుణంబెన్నఁజాలన్, విలోకింపఁజాలన్-నుతింపంగఁజాలన్-

రుక్మాం—మునీశాన సందోహ ప్రేమావలోకా,
మోహి—ఘనశౌర్యచంచన్మహాధైర్యరేఖా,
సంధ్యా—సునిడోద్భవాధీశ దివ్యత్తురంగా,
చంద్ర—అనాయాస నిర్ధూతదైతేయసంఘా,
శోభ—ధనూత్తంస కారిమ్యసిధ్యాతశార్ఙ్గా,
ధర్మ—మనోమాత్రసంసృష్టలోకప్రపంచా,
రుక్మాం—మనోజ్ఞప్రకారాత్తమాయూరపింఛా,
మోహి—దినాధీశమిత్రాది దేవేశపూజా,
సంధ్యా—జనాలోకదుర్గమ్య మహాత్మ్యజంఘా,
చంద్ర—అనాధారలోకాధికాధారవిజ్ఞా,

కోమ—దినేశాన తేజోతి గమ్య ప్రఖేటా,
ధర్మ—అనూచాన సేవావసన్నిలకంఠా,
రుక్మాం—అనాధేయగర్భస్థబ్రహ్మాండభాండా,
మోహి—క్షణాగమ్యవృత్తి ప్రకృష్టప్రగూఢా,
సంధ్యా—అనార్ద్రప్రభారావిరాజత్కృపాణా,
చంద్ర—సునిలా ధరత్రీ రమాసత్సమేతా,
కోమ—ఖనీభూత కారుణ్యాభంగీసనాథా,
ధర్మ—అనాయత్తమాహాత్మ్య వేదాంతపాదా,
రుక్మాం—సునాభీసరోజాతసంభూత వేధా,
మోహి—అనాఖ్యాతదుర్జ్ఞేయలీలావిధానా,
సంధా—సునామప్రభాజాలనిర్ధూతపాపా,
చంద్ర—సునాశీర చేతస్సరోజద్విరేఫా,
కోమ—సునాశద్విషత్కుంభి హర్యక్షశాబా,
ధర్మ—వినాయత్నసీవృత్తసల్లోకగర్భా,
రుక్మాం—సనాథప్రభోపేతవైకుంఠ ధామా,
మోహి—మనీషావిచారప్రనిర్దగ్ధమాయా,
సంధ్యా—వినీలాంచదుత్తుంగదీప్యచ్ఛరీరా,
చంద్ర—అనాదిప్రకారస్వసంబోధలీలా,
కోమ—సునారాయణా కేశవా వాసుదేవా,
ధర్మ—దినాధీశ మధ్యప్రకాంతప్రకాశా,
రుక్మాం—గుణాతీతవాఙ్మానసాతీత వేషా,
మోహి—ఘనానంతసానందశశ్వద్విలాసా,
సంధ్యా—మనోబుద్ధికర్మేంద్రియాతీత దేహా,
చంద్ర—వినాశప్రభాపూరకల్పాంత వేళా,
కోమ—సునిడాయతాకల్పచక్రప్రదక్షా,
ధర్మ—సురారాతిశిక్షా, సురేశానపక్షా,
రుక్మాం—మదేభేంద్రరక్షా, సదాదివ్యమోక్షా, నమస్తే నమస్తేనమః

(మంగళం. యవనికపడును).

—: మోహినీ రుక్మాంగద నాటకము సమాప్తము :—

# ఉత్తరరంగము.

———:o:———

[ ఒకానొక నటుఁడు ప్రవేశించి ]

ద్వి॥ అనఘాత్ములార రుక్మాంగదుచరితఁ
గనుఁగొన్న నాశ్చర్యకరమగుఁగాదె
ఘననిష్ఠసలిపి యేకాశీవ్రతము
వనజాక్షుసత్కృపఁబడసె నీఘనుఁడు 4

నిత్యమహావ్రతనిష్ఠఁ జెన్నారి
సత్యవ్రతమునిల్పుసరణికై యకట
జగతీజనంబులాశ్చర్యంబు జెందఁ
దగఁగుమారునినైనఁ దలగోయఁగడఁగె 8

నెట్టిసత్యవ్రతంబిది జనులార
పుట్టెఁజంపుటకోర్చుభంగియద్భుతము
ఏనిష్ఠయైన మహీజనుల్ జరుప
మానకయడరించు మహితమాయశము 12

ఎల్లనిష్ఠలలోన నిలసత్యనిష్ఠ
విల్లసిల్లెముకీర్తి వెలయించుచుండి
అదియుండుఁగాక మహాజనులార
మదినెంచియొక్కసూక్ష్మమునింతకనుఁడు 16

సత్యవ్రతంబుల సరిలేనిమహిమ
స్తుత్యుఁడై యున్న యీక్షోణీవిభునకుఁ
బట్టినైనఁదెగించివధియింపఁగడఁగు
నిట్టిమహాపదకేమికారణమొ 20

మతినెంతచూచిన మఱివేఱులేదు
అతికృత్యమొక్కటేయగుఁగారణంబు
వడి "నతిసర్వత్రవర్జయేత్తు" నెడి
నుడియింత తలఁపనెందునుదప్పనదియొ 24

అక్కటమంచికార్యం బైనఁగాని
మిక్కిలిచేయుట మేలుగాదరయఁ

జెలువార నేకాదశీవ్రతం బెంత
వెలలేనిదని తానువినియున్న నేమి 28

తానావ్రతముసల్పఁదగు నిందుభక్తిఁ
గాని లోకముపట్టుగాబలవంత

పెట్టంగఁదగునె యీనృత్తంబటన్న
నట్టనికష్టంబుగా నతిశ్రాంత్యవయ్యె 32

భావింపఁజనులకుఫలమయ్యెఁగాని
దేవవేశ్యలకు నెత్తినదుఃఖమయ్యె

నెంతమేలైననా నెవరికోకీడు
ఎంతకీడైననా నెరివకోమేలు 36

జాడగానటుమేలొసంగనికీడు
కీడొసంగనిమేలు క్షితినుండఁబోదు

మితిమీఱంగీడైనమేలైనఁగాని
యతిమాత్రముగఁజేయుటదివిరోధంబు 40

దానసేకాదె యీధరణీవరునకుఁ
గానని యెడనుండిఘనదుఃఖమడరె

హితమారజనులార యెన్నఁడుగాని
యతికార్యమొనరించుటదికీడుసుండి 44

విరిబోణులార సాధ్వీమణులార
యరయరే యిందుసంధ్యావళిచరిత

మిట్టిపతివ్రతలెందైనఁగలరె
యట్టివిచారింప హరిణాక్షులార 48

తెలియంగనీసాధ్వీధీరగుణంబు
వెలయాలికిని నించెనెసనద్భుతంబు

తానింతవలదన్నఁధనపతిమోహి
నీనారిఁగలయుటనిలుచుచునుండెఁ 52

బాడిగాదంచునొప్పకుమన్నయంచుఁ
దోడియాండ్రెల్ల నెంతో వేఁడికొనిరి
యొప్పులాడి నిజేశుఁ బోషరించువాంఛ
తప్పక తీర్చుటే తనధర్మమనుచు 56

ధీరమానసమునఁ దీపారి విభుఁడు
కోరిన వెలఁబూలిఁ గూర్చ దేయకట
యిది యెంత సతిధర్మ మిది యెంత సుగుణ
మిది యెంత యుపకార మిది యెంత ఖ్యాతి 60

యింతటి మాహాత్మ్యమెవయుటఁ జేసి
కాంత సంతసమారఁ గాంచె శ్రీధరుని
మంచి పతివ్రతా మహిమకు నెందు
నెంచి చూడఁగ సాటి యిల లేదటండి 46

బహుసునేయతులార బాలకులార
మహితంబుగాదె ధర్మాంగదు మహిమ
తనతండ్రి సత్యంబు తగ నిలుపుకొనుటకు
తనతలఁ దెగఁగోయఁ దానొడంబడునె 68

యీపసి బాలునకెంతటి త్యాగ
మేపారునే యెందు నింత వైరాగ్య
మహహా సుగుణమ మౌదారత యెంత
రహిమించు నాత్మతిరస్కారమెంత 72

విలసిల్లు సరిలేని పితృభక్తి యెంత
వెలలేని పరమార్థ విజ్ఞానమెంత
యరుదారి యున్న యాహరిభక్తి యెంత
పరఁగిన యుపకార పరతయు దెంత 76

శీలమెంత మహార్ధసిద్ధియదెంత
మేలెంత తత్త్వసమ్మితబుద్ధియెంత
బాలకులకు నెల్లభక్తియటన్న
వాలారు పితృభక్తివరరాజభక్తి 80

ఘనసత్యభక్తియుఁగడు దేవభక్తి
దనరారనివియెకాదాభక్తులవని
కర్తలౌ బాలకశ్రేష్ఠులార
ధర్మాంగదుని మహోదారసద్గుణము 84

లెల్లఁజేకూఱినీకేదియసాధ్య
మెల్లందుఁగీర్తియు నేపారుముదము
గలిగిభూజనులెల్లఁగనిమిమ్ముఁబొగడ
నలఘుదేశక్షేమమలరారుసుండి 88

———:o:———

# అనుబంధములు.

—————:o:—————

అనుబంధములు.

1 యమ—రాగము-బిలహరి తాళము.

మేలుగానాకు-నను-కూలమెంత
గల్గెనహా పోలఁగమఱి-చాలసుఖము
లీలనించేఁగాదే-సఖా ॥పల్లవి॥
పొందుగామిత్రతతి-నందమూఱఁజూడఁగా
నిందుగనర-విందనయను-చందమెందుపాడఁగా॥ ౧

2 అందము—రాగము-మోహాన రూపకతాళము.

పాలనసేయవేయోకరి-వరదాకరుణాలవాల ॥పల్లవి॥
ఎనలేని-కరుణజూడు-మనిపిమమ్ముఁ-గాపాడు-మనుచువేడు
వారముశ్రీ-వనజభవా దినుతశౌరీ॥పాలన॥
సురజాలావనకరుణా-కరసుగుణామాధవనీ
చరణసారసములపూజలె-మరువకచే-సెదముదేవా॥పాలన॥

3 మోహినీ—రాగము-హిందూస్తాని బెహాగ్ ఏకతాళము.

వర-నీరజనేత్రకరుణింపవే-నానేరములనుమదిమన్నింపవే
మదిమన్నింపవే-దయనింపవే ॥పల్లవి॥
నీమదినెంతోయాదరము-న్నింపఁగనీవఱుకుఁ బ్రేమజెలంగఁగ
నాయెడఁ-బెంచితిమోహముఁ॥వర-సామాజయానదయ
పోనాడకె-నను-నీమాడ్కి-నరగంటఁ-జూడఁగనేనెటు
కాముబారికిని-దాళుదునే-హాకామినీ ॥వర॥
చాలునునాపైఁగోపమునీ-సమ్మతిఁజూపగదే
బాలరోనాయపరాధముఁ-వారకకావవె॥

అనుబంధములు.

వరళినాళీకముఖినే-నీదాసుఁడనీ-కేలంటికాలంటి
వేడెదఁగానను-బాలించికౌఁగిలియీఁగదవె నీలాలకా ॥౨॥

4 మోహిని—రాగము-బెహాగ్ ఏకతాళము.

నా-మోహన-రారానాకు-మోదము-నింప
నామోహనరారా-నాప్రాణేశ రారా నాకు ॥పల్లవి॥
తాళగలనె కడుదయతో-తగదేనక్కగలసి
యేలరార-బాళిదీర-యిదెంత వింతచలమో
యెలానీ-కీలాగు-శ్రీలోల-తాళనురా
చాలఁగనె-బాలనురా॥నామోహన॥ ॥౧॥
చిన్నతసమున నెనియడ-జెలఁగినమోహమునఁ
జెన్నుమీఱి-యున్ననాఁడి-సిలుగుబెట్టఁదరమా
యున్నతి చెన్నారగ-నన్నేలక-యున్నావుగా
యెన్నాళ్ళునా-విన్నపము॥నామోహన॥ ॥౨॥

5 అందలు—రాగము-పీలు ఆదితాళము.

వాణీనాయక-వైభవదాయక
వరజగత్సృష్టివిధాయకా ॥పల్లవి॥
తుంగవిలాస-మంగళవేషా
సంగతసజ్జనపోషణా॥ ౧
శ్రీమహనీయా-ప్రేమామేయా
కామితఫలసంధాయకా॥ ౨
పాపవిభంగా-తపసంగా
దీపితహంసతురంగమా

6 బ్రహ్మ—రాగము-బిలహరి రూపకతాళము.

ఇందిరావిభుఁడు-నందనునెడ
నందంబగు-చందముదయ-చెందెనుగా ॥పల్లవి॥

అనుబంధములు.

వనరుహాలోచనునకుఁ దెలి
యని యోచన నాకున్న దె
ఘనమగు ననురాగమునన్
మనసారగ-ననుజూచుట
కని కాదె-నినుపంపెను॥ఇంది॥ ౧

7 అప్సరసలు—రాగము-సురటి రూపకతాళము.

శారదామనోజ్ఞ-భృంగవారిజాసనా॥
దేవపాలనందనా-శ్రీవరనందనా
పావనమౌనీంద్రవినుత-పాదపంకజా॥ ౧

8 అప్సరసలు—రాగము మాంఝ్ రూపకతాళము.

ఆహాధాతమాకానె-కూర్చుండగా
మహాకష్టగతిగల్గె-నేమందుము॥
నిరంతర వైకుంఠ-గమనంబున
దురంతంబుగామాకు-దుఃఖంబగున్॥ ౧
పగల్ రాత్రియెడలేని-నాట్యంబునన్
దిగంబారె-బల్లెమెల్ల నేట్లోర్తుము॥ ౨
గతులోప్పనిది యమియేకాదశీ
వ్రతంబయ్యెయో-యెంతవర్ణింతుము॥

బ్రహ్మ—రాగము-కాంబోజి రూపకతాళము.

ఇదినాకుదరమే-తరుణీ
ఇంతటి-కార్యము-సాధ్యమెరమణీ॥
వింతగనను-నింతయడుగ-స్వాంతమునకు
చింతగదా-తలపఁగ-కాంతరో-యింతటి
వంతల-జింతిలి-మెంతకాల మింతదాళసంతోషమా॥

అనుబంధనములు.

10 అప్సరసలు—శ్యామకల్యాణి. ఆదితాళము.

మాకు-వారనిముదమలరారెను
చేకొనిసరసము-లాడుదము॥ ॥పల్లవి॥
విలాస-ములాయె-బలామ-నలాగిది॥
తరుణులకిదెయీ-వెరవునమదిలో
తెరసినముదమిం-పరయగగదిరే॥
సురు-చిర-విధమున-గర-మరు-దగునద॥మాకు॥ ౧
విలసితగతిమా-కలరెనుదగ-నేడలవిగసన
సొం-పలరెనుగదనే-భళి-భళి
విధమున-సలలిత-గతినిటు॥మాకు॥ ౩

11 రాగము-కేదార. ఆదితాళము.

ఉర్వశి—నాగవేణిరమణీ-తరుణీనమదయగనవే-మనుపవెఱుటు ॥పల్లవి॥
మోహి—భూమిపాలతిలకా-తగునే-పురుషులమనుచుం-
బలుకఁగనిటు ॥పల్లవి॥
ఉర్వశి—నీ-వీకరణిందయఁగనవే వేకరికోరిననునీ
నాకులపెట్టఁగఁదరుణీ-భీకరమదనుని-దాళనుసఖ॥ ౧
మోహి—భూ-మీవరచూడవలదెనే-దేవలతాంగినిగానా
నావిధమంతయుఁగనకే-యీవగనీమదిఁదలపోయవె॥ ౧
ఉర్వశి—లేమనీవెల-లేనిరూపము-నామనంబున-నిల్చెగా
ప్రేమతో-విన్నపం-బెన్నుచు-కాముబారిదొలంగగా॥ ౨
మోహి—ధారుణీధవనీకు-జెల్లునే-తారతమ్యముచూడక
వారకీ-దారిదే-వాంగన-గోరుసరసతధర్మమె॥ ౩

12 రాగము-హిందుస్తాని జంజూటి ఏకతాళము.

ఉర్వశి—వరసరోజనయనా-మరాళసుందరగమనా
ఇదికరాళగతితలపఁగదే॥ ॥పల్లవి॥

అనుబంధములు.

మోహి—వర-ధరాధిరమణా-సరోజపుసమవదనా

నిను-వరింపగలదే-దడయఁగదే॥ ॥పల్లవి॥

రుక్మా—కడుఁ-గృపాపరతమన్నింపవే-వర-జపాకు

సుమసామ్యాధరా-నాపైన-గోపము-మానవె కామినీ॥ ౧

మోహి—నామనోరమణాయిటులడయఁగ-గను-వినోదమని

మదిగనక-జానార-నీనారిగా-నెంచినిల్వవే॥ ౧

13 కోమల—రాగము-చక్రవాకము త్రిపుటతాళము.

మనసునదయలేక-వనజాక్షియిట్లుచేసె నేఁడు

మనుజేశుఁగొన్నదయ్యో-ఘనపాపకర్మమాయెగా వె॥ పల్లవి॥

వెరతారనిట్టిరీతి-ధరలోననెందునైన-విన్నారమె

తరళాక్షిపైన నేఁడు-దయజూపనోనెనికు కాంతామణి ౧

14 సంధ్యా—రాగము-ధన్యాసి ఆదితాళము.

పరికింపరే-విరిబోఁడులారా

ధరణీశవరుని-నిరసింపనానె

తరళాక్షులారా-తరమానె-విభుఁగలపగ॥ ॥పల్లవి॥

మననాథుఁడింత-మదినొచ్చెనేని

వనజాక్షులారా-తనవున్ననేమిఫలము॥ ౧

15 రాగము-కాంభోజి ఏకతాళము.

సంధ్యా—మోహినీసతీ-మోదంబగునీచరితకు॥ ॥పల్లవి॥

మోహి—మానినీమణీ-నానేరము-కరుణింపవే॥ ॥పల్లవి॥

సంధ్యా—నీ-కరుణా-లో-కమునకు-మా-కొదువల్

శోకార్చితిగద కామిని॥మోహిని॥ ౧

మోహి—భామినిరో-నీ-మహిమల్ నా-మదిలో

నేమంచునుగొనియాడుదు॥మానినీ॥ ౧

అనుబంధములు.

సంధ్యా—ఎంతో-దయగలుగఁ-గాంతా-మముమనుపఁ

వింతా-ఘనగతిగా-సంతోషముమదిలో-జెందితిమిటు॥ ౨

మోహి—బాలా-నీమహిమల్-చాలా-ఘనములుగా

పలా-ననుబొగడఁ-మేలా-పలుకగనీవిధమున॥ ౨

సంధ్యా—సారసదళసమనయనా-రజనిపవదనా

బిసరుహనేత్రా-యసమముగాదే యసుపుల-బెంపఁ

నీదయనిటు॥ మోహినీ॥ 3

మోహి—కామినినను దయగనుమా-మనవినివినుమా

ఘనమగు నేరం-బొనరెను నాకుఁ-గొనకొని వేఁగ-

వచ్చితినిటు॥ 3

16 మోహి—రాగము-పీలు ఏకతాళము.

భూరమణా-రతిగోరుదాన॥ ॥పల్లవి॥

వాడిశరమ్ముల-వంచన నేయుచున్నాఁడు

బ్రదుకఁగా-నీకుమారుఁడు॥ ౧

17 రాగము-కాంభోజి ఏకతాళము.

రుక్మాం—మానగఁజాలుదునే-నాగవేణీ

కానకవిమలై-కాదశివ్రతము॥ ॥పల్లవి॥

మోహి—తాళఁగజాలుదునే-ప్రాణనాథా

చాలు నేకాదశి-యేలుమురమణా॥ ॥పల్లవి॥

రుక్మాం—కీడును మేలును-జూడక యీలాగున

వేడగనీకును-బాడియెరమణీ ౧

మోహి—మంచియొ చెడ్డయొ-మించెను మోహము

ఎంచివదలగా-వంచనగాదె॥ ౧

18 రాగము-జంజూటి తాళము.

మోహి—కుమారా-యిదేలయీచరిత

చూడవే-చూడవే-ప్రమాదగుఁ ॥పల్లవి॥

